**N.S.P-KNR-A.P. Book No. 50**
**Palleseema (Telugu Songs)**
**by Dr. Malayasri,** *M.A. MOL, Ph.D.*



డా॥ మలయశ్రీ లబ్ధ ప్రతిష్ఠుడైన కవి, ప్రముఖ రచయిత. నలుబదేండ్లుగా వీరిది అవిశ్రాంత సాహితీ వ్యాసంగం. శతాధిక గ్రంథకర్త.

తెలుగు అకాడమీ, విశాలాంధ్ర, తెలుగు విశ్వవిద్యాలయం, రసమయి, సుధర్మ, ఎం.ఎం. అకాడెమీ-కలకత్తా, భారతీ పరిషత్-ప్రయాగ మొదలగు ప్రతిష్ఠాత్మక అవార్డులు పొందినారు. ఈ సంవత్సరం వీరు అందిన సత్కారాలు, 1. సామాజిక సమరసతా వేదిక పోటీ పద్యకవిత ప్రథమ బహుమతి (6-12-08). 2. నిజాంపట్నం సామ్యవాద సాహితీ పురస్కారం (23-2-09), 3. ఆంధ్ర సారస్వత పరిషత్ హైదరాబాద్ వారిచే బి.ఎన్. శాస్త్రి గారి స్మారక ప్రసంగ సత్కారం (7-9-09), 4. మండలి వెంకట కృష్ణారావు గారి స్మారక "నడుస్తున్న చరిత్ర" పోటీలో వీరి "నిర్ణయం" నవలకు ప్రథమ బహుమతి పురస్కారం-విజయవాడ (27-9-09).

భాషగుట్టు భావం పట్టు తెలిసిన కవి మలయశ్రీ. 30 ఏండ్ల క్రితం వీరు రచించి ప్రచురించిన ఏకైక తెలంగాణ మాండలిక గేయ కావ్యం ఈ "పల్లెసీమ". సాహిత్యాభిమానంతో ఇప్పుడు ఈ కావ్యం మూడవ ముద్రణకు సహకరించిన గౌ॥ ఎర్రమరాజు దంపతులకు మా ధన్యవాదములు.

తెలంగాణ మాండలికంలో మొదటి గేయకావ్యం

# పల్లెసీమ

1978

## డా॥ మలయశ్రీ



నవ్యసాహిత్యపరిషత్-కరీంనగర్
ఆంధ్రప్రదేశ్

2009

తెలంగాణ మాండలికంలో
మొదటి గేయకావ్యం

# పల్లెసీమ

మలయశ్రీ

నవ్యసాహిత్యపరిషత్-కరీంనగర్
ఆంధ్రప్రదేశ్

నవ్య సాహిత్య పరిషత్ - కరీంనగర్
ప్రచురణ నెం. 50

రచనా కాలం : 1975
మొదటి ముద్రణ : ఫిబ్రవరి, 1978
రెండవ ముద్రణ : సెప్టెంబర్, 1978
మూడవ ముద్రణ : సెప్టెంబర్, 2009

ప్రతులు : 500
వెల : 20/-

ప్రతులకు:
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
హైదరాబాద్-1.

రచయిత:
డా॥ మలయశ్రీ
వేమననగర్ (రేకుర్తి)
కరీంనగర్-505 451
సెల్: 9866546220

ముద్రణ:
ఆండాళ్ ప్రింటర్స్
బస్ స్టేషన్ రోడ్
కరీంనగర్-505 001
ఫోన్: 0878-2230610





# అంకితం



డా॥ రాజవైద్య పింగిళి లింబాద్రిరెడ్డి, నెమలికొండ గారికి
ప్రేమ పూర్వకముగా

పండితుడు, కవి, రచయిత, వైద్యవరుడు । నటుడు, చిత్రలేఖకుడు, విజ్ఞానపునిధి,
రాజభోగ యోగంబుల రాణ గలుగు । ఎనుబదేడుల యనుభవ వృద్ధుడతడు.

వారి గ్రామంబు చేరిన ఆరు నెలల । వరకు మాకు ముచ్చటలేని జరుగలేదు
పిదప సాహితీ స్నేహమ్ము పెరిగి పెరిగి । నేటికీ కృతి బంధమ్ము నిలుకడయ్యె.

కవిత వ్రాయనెంచగ లేదు కలనుగాని । కలలలో సైతమిప్పుడు కవిత వ్రాతు
ఏయపూర్వ ఫలంబు సాధించుకొరకొ । నా మనోవీధిలో నిల్చె నవ సుకవిత.
తెలుగు పల్లెల అందాల, తెలుగు పదుచు । వారి వలపుల తలపుల, పల్లె ప్రజల
బ్రతుకు రీతుల-తీయని పల్లెనుడుల । మన తెలంగాణ ప్రాంతపు మాటలందు
పాటలుగ చిన్న కథ దీని వ్రాసినాడ, సంతసించుడి సరసుల చదివి, పాడి!

రచయిత

జనవరి - 1978 ( నెమిలికొండ )

# కృతి స్వీకర్త - కృతజ్ఞతలు (తొలి ముద్రణ)

1924 నుండి 44 వరకు "విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల" పేర వివిధ విషయములకు చెందిన 21 పుస్తకములను ప్రచురించినాము. తర్వాత నా ఆసక్తి వైద్య వ్యవసాయ రంగములదెసకు మరలి పుస్తక ప్రచురణ మానివేసినను అప్పుడప్పుడు కాకతీయ, గోలకొండ మొ॥ పత్రికలు నా సాహిత్య వ్యవసాయ వైద్య విషయములకు సంబంధించిన కవితలు కథలు వ్యాసములు ప్రచురించుచునే యున్నవి. ఇన్నాళ్లకు కవి మిత్రులు మలయశ్రీ గారి 'పల్లెసీమ' గేయ కావ్యాన్ని మా 'వి.ప్ర. గ్రంథమాల' 22వ, పుస్తకముగా ప్రచురించుట మాకు ఆనంద ప్రదమైన విషయము.

ఈ కావ్యభాష తెలంగాణా మాండలిక తెలుగు. గేయములు శైలీ ప్రసన్నములై జానపద గేయముల పక్కీలో గాన యోగ్యములై రాగ ప్రసన్నములై యున్నవి. కథ అభ్యుదయ భావ యుక్తమై గ్రామ జీవిత విధానమునకు దర్పణమై యున్నది. తెలంగాణా మాండలిక భాషలో ఒక గేయ కావ్యము వెలువడుట నాకు తెలిసినంత వరకిదియే మొదటిది.

అభ్యుదయ భావుకుడు, మూఢ విశ్వాస విరోధి మానవతావాది అయిన, వీరి ఇతర కావ్యములతో పాటు చక్కని కథా సంవిధానము కలిగిన వీరి నవలలు ప్రచురణకు రావల్సి యున్నవి. తప్పక వెలుగు చూసి రాణించగలవు. మా స్నేహమును పురస్కరించుకొని స్వల్ప సహాయమునకే సంతృప్తులై నాకీ కావ్యమును సమర్పించినందులకు కవి గారికి నా హార్దిక కృతజ్ఞతలు.

-డా॥ పి.ఎల్. రెడ్డి

(నెమిలికొండ)





## మలి ముద్రణ - ప్రముఖుల పీఠికాలు

ఈ 'విజ్ఞాన ప్రచరిణీ' గ్రంథముల సంపాదకులు డా॥ లింబాద్రిరెడ్డి గారు బహుముఖమైన ప్రతిభగల వయోవృద్ధులు, జ్ఞాన వృద్ధులు. వ్యవసాయము వైద్యములో వారు ప్రవీణులేకాక తెలంగాణా సాహిత్యరంగములో సుప్రసిద్ధులు. తెలంగాణాలో వారు పాల్గొనని జాతీయోద్యమమే లేదనినచో అతిశయోక్తి కాజాలదు. సుమారొక అర్థ శతాబ్దికి పైగా వారు దేశసేవ భాషాసేవ చేస్తూ ఉపయోగకరమైన జీవితాన్ని గడుపుతున్నారు.

ఈ 'పల్లెసీమ'ను డా॥ రెడ్డి గారికి అంకితము చేసిన మలయశ్రీ గారు అభినందనీయులు, ఈ పల్లెసీమ గేయకవితా సంపుటి. ఇందులోని పాటలన్నీ తెలంగాణా మాండలికములో రచితమైనవి. రసార్ద్ర హృదయులకు ఆహ్లాదకరమైన యీ పాటలు మంచి శైలిలో పాడుటకు అనువుగా రచితమైనవి. ఇంత చక్కని పాటలు వ్రాసిన మలయశ్రీ గారికి, నా అభినందనలు. ఈ గేయ కావ్యానికి సుస్వాగతము. ఆంధ్ర పాఠకలోకము ఈ పుస్తకాన్ని ఆదరించగలదని విశ్వసిస్తున్నాను.

లేఖ సంఖ్య: 2818 | సం॥
కళాభవన్-హైదరాబాద్. | **దేవులపల్లి రామానుజరావు**
తేది: 15-4-78 | కార్యదర్శి-ఆం.ప్ర. సాహిత్య అకాడమి.

**Prof. Dr. C. NARAYANA REDDY**
Telugu Dept. Osmania University - Hyd.-7

Date 8-5-1978.

మలయశ్రీ గారు చాల కాలంగా రచనలు చేస్తున్నారు. తెలంగాణా (కరీంనగర్) మాండలిక భాషలో రచించిన గేయ సంపుటిని 'పల్లెసీమ' రూపంలో ఇప్పుడు ప్రచురిస్తున్నారు...

లోగడ తెలంగాణా మాండలిక భాషలో గేయ సంపుటులు కొన్ని వెలువడ్డాయి. లచ్చిపాటలు, ముత్తిపాటలు మొదలైనవి. ఆ కోవలో వెలువడిన సంపుటి ఇది. ఒక మాండలికం నాడిని పట్టుకోవడం అంత సుకరం కాదు, యాస బాసలో పాటలో వ్రాయడం ఎంత కత్తిమీది సామో అనుభవజ్ఞునికే తెలుస్తుంది. 'మలయశ్రీ' గారు చాలావరకు ఆ సాములో సఫలులైనారు. అందుకు వారిని, కృతి స్వీకర్త డాక్టర్ లింబాద్రిరెడ్డి గారినీ అభినందిస్తున్నాను.

-సి. నారాయణరెడ్డి

# కృతజ్ఞతలు

అర్ధ శతాబ్దినాటి అధ్యాపక మిత్రుడు
నా సాహిత్యాభిమాని
ఈ కావ్య ముద్రణ ప్రోత్సాహకులు
(కీ॥శే॥ ఎర్రమరాజు రామయ్య-భూమక్క (శనిగరం) గారల కుమారుడు)
శ్రీ ఎర్రమరాజు సత్యనారాయణరాజు
శ్రీమతి లక్ష్మి (కరీంనగర్) గారలకు -



( శ్రీ సత్యనారాయణ రాజు, శ్రీమతి లక్ష్మి )

వారి కుటుంబంలోని మూడు తరాలవారు నాకు మిత్రులు.
అందరికీ అభినందనలు.

- రచయిత





# శుభ కామన

## ధన్యజీవి - మాన్యజీవనం

రాజు సత్యనారాయణ రాజు నిజము
చిక్కులెరుగడు చిరునవ్వుచిందు ప్రేమ
మాది అర్ధ శతాబ్దపు మైత్రియైన
కలిసి నపుడెల్ల ప్రేమతో పలుకరించు.

వారి కన్నింట సరిజోడు వారి పత్ని
పుత్రులన్నారు ముగ్గురు, పుత్రికొకరు,
మనుమలును ముచ్చరిద్దరు మనుమరాండ్రు!
ఆశవారికి అందరి అభ్యుదయము.

సత్యము నారాయణుడన
సత్యము! శ్రీలక్ష్మితోడు - సంతానముకున్
నిత్యము విద్యాదానము,
నిత్యము ముద్రణము - నేడు నిర్మల వృత్తుల్.

సంతసింతు రాజు సంసార నీతికి
సౌమ్య వర్తనముకు శాంతమునకు,
సంప్రదాయ నిరతి సాహితీప్రీతికి
ఎలమి బంధుమిత్ర హిత సుమతికి.

శ్రీయు విద్యయు వారింట చెలగు చుండి
చదువు సంబంధ వృత్తులు సాగుచుండి
ఆత్మతృప్తికి యీ కావ్యమచ్చు వేసె
ధన్యవాదాలు - శుభములు తనరు తమకు.

*17-9-09*
నైజాం విముక్తి దినం.

- డా॥ మలయశ్రీ
కరీంనగర్.

## మూడవ ముద్రణకు ముందుమాట

ఈ 'పల్లెసీమ' పుట్టుక 1975. తొలి మలి ముద్రణలు 1978లో. ఈ రచనకు ప్రేరణ డా॥ సి.నారాయణరెడ్డి గారి సన్మానసభ-మల్యాలలో వారు పాడిన తెలంగాణా మాండలిక గేయాలు. ఈ కావ్యరచనకు ప్రోత్సహించినవారు కవిశ్రీ వి. కేశవరావు-గుండి. అంకితం పొందిన రచయిత రాజవైద్య శ్రీ పింగిళి లింబాద్రిరెడ్డి-నెమిలికొండ. పీఠికలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, డా॥ సి. నారాయణరెడ్డి గారలవి.

ఇది ఉత్తర తెలంగాణా జిల్లాల్లో చాలా వ్యాప్తిపొందింది. కోస్తాకు పోకపోవచ్చు. మాకు పబ్లిషర్లు లేరు. పంపిణీ సౌకర్యమూ లేదు / తక్కువ.

'ఎంకి పాటలు' కోస్తాకు ఉన్నట్లు తెలంగాణాకు మాండలిక భాషలో ఒక కావ్యం రావాలె అనే భావన నన్నీ కావ్యం రాయించింది. కాని, లచ్చి పాటలు, ముత్తి పాటలు - ఎంకి పాటల అనుసరించి ఇటు వచ్చినట్లు నా 'పల్లెసీమ' పీఠికలో డా॥ సి.నా,రె గారన్నరు. ఈ మధ్య 'తెలంగాణ సర్వస్వం' (2009) లో కర్ర ఎల్లారెడ్డి గారు తెలంగాణా మాండలిక గేయ పుస్తకాలుగా చౌడూరి గోపాలరావు గారి 'మల్లి పాటలు', రఘురామారెడ్డి గారి 'ముత్తి పాటలు' పేర్కొన్నరు-పుట 511. అవి నేను చూడలేదు. అవి కథా కావ్యాలు కాక, గేయ సంపుటాలైతే నాదే మొదటి తెలంగాణా మాండలిక గేయకావ్యం. దీని తర్వాత మాత్రం మరో గేయ కావ్యం ఇక్కడి భాషలో వచ్చినట్లు లేదు.

ఈ మధ్య డా॥ శంకరమంచి శ్యాంప్రసాద్ "మలయశ్రీ, కవిత్వం-పరిశీలన" పిహెచ్.డి. గ్రంథంలో 'పల్లెసీమ'పై రాసిన చక్కని విశ్లేషణ (2009, పు. 61-67) చూసి నా ధ్యాస ఈ కావ్యం వైపు మళ్ళింది.

నావి ఎన్నో పుస్తకాలు వస్తున్నా (ఇప్పటికి 105), ఇప్పుడిది మూడవ ముద్రణగా ముప్పదేండ్లకైనా వెలువడుతున్నందుకు ఆనందంగానే ఉంది. ఈ ప్రచురణకు కారకులు, సహాయకులు, అధ్యాపక మిత్రులు, వయోజ్ఞాన వృద్ధులు శ్రీ ఎర్రమరాజు సత్యనారాయణరాజు, వారి సహధర్మచారిణి శ్రీమతి లక్ష్మి గారలు. వారి సాహిత్య ప్రీతికి ధన్యవాదాలు. వారి కుటుంబ సభ్యులకు శుభాకాంక్షలు.

మన మాతృభాష తెలుగును, తెలుగు మాండలికాలను కాపాడుకుందాం. మన తెలంగాణా తెలుగు పాటలను స్వాభిమానంతోని సంతోషంగా పాడుకుందాం.

సెలవిప్పటికి, స్నేహమెప్పటికీ!

ఉగాది. - డా॥ మలయశ్రీ
27-3-2009



# పల్లెసీమ

## 1

మాపల్లె చిన్నది - మా సక్కగున్నది
స్వంతపూరన్నది - స్వర్గమనిపించుద్ది
ఇటుపక్క చినకొండ - అటుపక్క పెదకొండ
రెండు కొండల నడుమ - బండిబాటున్నది ॥

కుంటపక్కీదుల్లు - కుంటదాటితె తాళ్ళు
కాసులుంటే చాలు- కైలాసం చూడచ్చు ॥

మానేటి ఒడ్డున - మామిడితోటుంది
కోలుకత్తే చెట్లు - కోరగిస్తయి కండ్లు ॥

ఏటిసుకల యాసంగి - పూటపండ్లుంటయి
వానకాలం వాగు - వరద గోదావరి ॥

## 2

వెన్న కారం రాసుకున్న - జొన్న రొట్టె తింటెకాని
పచ్చి కంకులు తంపినుంచి - యెచ్చయెచ్చగ తింటెగాని
పల్లెటూరి పసను తెలిసేవూ - పట్నానవున్నా
పల్లెనే మలమల్ల తలిసేవూ.

బుగ్గలేగిన మక్క ప్యాలాల్ - బుక్కనిండా నమిలితేను
పట్టుపాలు దోరగాచి - పట్టినన్ని తాగితేను ॥పల్లె॥

దోసకాయ కోసి ఉప్పు - రాసి కరకర నమిలితేను
దోరబండిన జామపండ్లు - కొరికి తియ్యగ మింగితేను ॥పల్లె॥

జిడ్డు పేరిన గడ్డ పెరుగు - చింతకాయ తొక్కు కలిపి
యెన్నసొంటి మక్కముద్దో - సన్నబియ్యం బువ్వొతింటే ॥పల్లె॥

## 3

(పల్లెటూరి యువకుడు క్రిష్ణయ్య రమణమ్మ అనే పడుచును పచ్చని చేన్ల గట్లమీద వెంబడించి ఇట్లంటడు)



గాజులూ మాట్లాడుతుంటే
గడ్డిమోపూ నెత్తికెత్తి
పడుచు పిల్లా వస్తుంటే
పైరగాలి వీస్తుంటే
పానమంతా జువ్వుమంటదీ – నన్నుజూచి
పడుచు పిల్ల నవ్వుతుంటదీ ॥

ఏటికాడా మోపుదించి
యేటిపాయు చేరనడిచి
నీటిలో తన నీడజూచి
నీడపక్కనె నన్నుజూచి
పడుచుపిల్ల నవ్వుతుంటదీ – నా సామిరంగ
గడుచు చూపు రువ్వుతుంటది. ॥

ఎనకదిక్కు నన్నుజూచి
యెక్కిరించి మూతి తింపె
మూతితోనె ముక్కు కదిలె
ముక్కుమీది ముత్తె మెగిరె
అందమంత చిందిపోతదీ – అయ్యయ్యో దాన్ని
అందబోతే కందిపోతది. ॥

## 4

(రమణమ్మ ఆ యువకునితో ఇట్లంటది)



ఒంటిగా నే పోతవుంటే
కుంటపక్క నక్కి వుండీ
కొంటెగా నా దిక్కుజూసి
కోరమీసం దువ్వుకుంటవ్
చేతగాని సరసమేమిరా – ఓరయ్యా నీ
చేత జూడ నీతికాదురా. ॥





పెండ్లి జేసుకుందామంటే
కండ్లనూ తేలేసి చూత్తవ్
యెల్లిపోతానంటెనేమో
కళ్ళనిండా నీళ్ళు తెత్తవ్
పరుల కంట పడితె గండము – ఓరయ్యా నా
తెరువురాకు నీకు దండము ॥

## 5

ఇగురం ఉంటేనే యెవతీ
యినదయ్యా ముద్దుల మరదీ !
సీనిమాలు చూసి నువ్వు
సీట్లు కొడుతు తిరుగుతవుంటే
మాటుగాసి యెవడో నీ
మక్కెలిరుగ గొడుతడు మరిదీ.

నా యిష్టం అని నువ్వంటే
నా యిష్టం అని వాళ్ళంటరు
యిస్టంతో కష్టం వుంది
ఇది మంచికి కాలం మరదీ–

బలముందని బడితెను బడితే
పది బడితెలు వొకటైతాయి
పడుచోనివి బతికేదుంది
గడుసుతనం వదులన్నోయి ॥

కావన్నని యెంబడిబడితే
కావలించుకోదోయ్ యెవతీ,
వద్దని నువు దూరంలబోతే
వచ్చి మీద వాలేదుంటది ॥

## 6

((క్రిష్టయ్య, రమణయ్య మధ్య సంభాషణ)

రాత్రిరికి నర్సిహ్మసామి రథం కదులుద్దట
వత్తావె పిల్ల చూసి వత్తాం పొద్దటిపూట?

కచ్చురాన్ని కట్టుకత్తె - గాజులు పెట్టిత్తనంటె
మచ్చెగిరిని మొక్కెయాళ్ళ - మరి నువు నవ్వియ్యనంటె
వత్తానయ్యా నేను రతంకాడికి - ఆ
సత్తెమున్న సామి పూజె చేసుటానికి.

గళ్ళకోక కట్టుకొని - తెల్లరైక తొడుక్కొని
కురులుముడ్చి పూలుబెట్టి - కుంటకొమ్ముకాడ నిల్వు
సందెలు వడంగనె - సవారు బండి కొట్టుకొస్త
సంబ్రంగా పొయ్యత్తాం సామి యాత్రకు.

పక్కచూపు లుండద్దు పరాశికాల్ చెయ్యద్దు
పడుచుపోర్ల నొరిసి నడిసి పకపకమని నవ్వద్దు,
అడ్డదిడ్డగాళ్ళు కల్తె ఆల్సెం గానియ్యద్దు
అట్లైతెనె వత్తనయ్య సామి జాత్రకు.

సరెలే నీ మాటెయింట సరిగా నీ యెంటవుంట
మరియాదగ నడుచుకుంట సరసం నీతోనేయంట,
చెప్పకెవ్వలకు ఇంకే చెల్లెనా తోడుకు తేకు
తప్పక యేగిర్తంగా తయారయి రా పోదాం.







## 7

(సీతమ్మ మరిదితో)

యెరుకయ్యిందోయి మరిదీ యెరుకయ్యిందీ - నువ్వు
ఏమేమి చేస్తున్నవొ యెరుకయ్యింది.
నీ కండ్లను మూసుకుంటె లోకానికి కండ్లుండయ?
ఎంతగ దాస్తామన్న యేదీ దాగదు మరిదీ-
ఏడేడికి పోతున్నవొ ఏమేమిటి చేస్తున్నవొ
ఏటిపాయ నీటి పక్క ఏయేశాలేత్తున్నవొ-
ఏ జాతర కెళ్ళస్తివొ ఏజాతర జేస్తున్నవొ
నీ జాజిరి పాటలెన్నో నీ జాగారాలన్నో-
నీకేమిటి మగరాజువు నీకేమనిపించదేమొ
ఆడదంటె అరటాకు ఆడుకోకు ముల్లుగాకు-

## 8

(సీతమ్మ తన చెల్లె లక్ష్మిని తమింటికి పిలిపించుతుంది. లక్ష్మి ఒంటరి వేళ కొంటెగా క్రిష్టయ్య వెంటపడుతది.)

బావయ్యో! బావయ్య!!
పడుచుపిల్ల యెదురొస్తే
పరుగెత్తి పోతున్నవ్॥
పాలపిందెవోలె రూపున్నాది
పైడికంటెవోలె సూపున్నాది
నాగుబామువోలె చురుకున్నాది
జెర్రిపోతంతటి పిరికున్నాది॥
రూపున్నా చూపున్నా
రూపాయలు శానున్నా
ధైర్యమె లేకుంటె మొగోడు
దండుగ దండుగ దండుగరయ్యో॥
మూడుముళ్ళు వేసినవంటే
ముక్కుకు తాడు కట్టేస్తా
మూడు చెర్ల నీల్లు తాగిస్తా
మూలకు మంచం నీకేస్తా॥



## 9

( క్రిష్ణయ్య, లక్ష్మితో)

చెడుగుడు చెడుగుడు చెడుగుడులాడే మిడతమ్మా
నీ గడబిడ మానకపోతే భరతం పడతమ్మా ॥
సింగిడి బింగిడి లాడద్దు
గంగెద్దోలె తిరుగద్దు
పాయిరమోలె రూపుంది
పైడికంటె వలె పలుకద్దు- చెడుగుడు
మూడుముళ్ళు మెడకేకాదు
ముగుదాడేత్తడె నీ మొగడు
యెగురకుండ చెర్రి గుంజాతడు
నీ పొగరునంత పోగొట్టుతడు- చెడుగుడు

## 10

(సీతమ్మ, మరిది సంభాషణ)

పెండ్లి చేసుకోహోయ్ మరదీ పెండ్లి చేసుకోవయ్యా
పెండ్లి చేసుకున్నవంటే పిచ్చి కుదిరిపోతదయ్యా-
పిల్లనైతె చూడో వదినా పిల్లనైతె చూడమ్మా
పెళ్ళిచేసుకుంటా కాని పిల్ల నీవోలుండాలమ్మా-
మా చెల్లెను చూస్తివ మరిదీ! మంత్రమేసినట్లయిపోతవ్,
మారుమాట పలుకవు మరదీ, మంచి జోడు మీయిద్దరికీ-
మీ చెల్లె వద్దో వదినా! మీ చెల్లె వద్దమ్మా;
మిడిసి మిడిసి పడుతది చూడు, గడుసుపిల్ల నాకాజోడు?
పడుచుపిల్ల కదనోయ్ మరిదీ మిడిసి పాటు కాదయ్యా !
గడుసుతనము పెండ్లయె వరకే పడుచు నీకు చక్కని జోడు-
కుమ్మరింట కుండను కొంటెనె కొట్టికొట్టి చూసుకుంటరు
పెండ్లి చేసుకోవన్నంటె కండ్లు మూసుకొని కాదమ్మా-





## 11

(క్రిష్ణయ్య అన్న రామన్న తమ్మునితో)

ఏనాడు ఏమడిగి యెరుగ, తమ్ముడా !
ఈనాడు ఇటులౌట యెరుగ ॥
తొట్లె గుడ్డను నిన్ను ఎట్లెట్లనో సాదె
తన కొడుకని నిన్ను అనుకుంది మీ వదినె- ॥ఏనాడు॥
మాట కటుకేకాని మనసేమొ వెన్న
నీవుదూరంబోతె చావె నిజమన్న ॥ఏనాడు॥
లచ్చిమి లచ్చిమె లచ్చనంగా ఉంది
పెట్టుపోతలు శాన ముట్టజెప్తరు వాళ్ళు ॥ఏనాడు॥
నీ వదినె మాటను నీవు కాదనకు
నువుతప్ప మాకింక యెవలూలేరయ్యా- ॥ఏనాడు॥

## 12

(క్రిష్ణయ్య, రమణయ్య మధ్యన సంభాషణ)

కలిగున్నవానివని తెలిసుండిగూడ నిను
కలిసుంట తప్పునాదీ - నినునమ్మి
కలగనుట తప్పు నాదీ.
మేనమరదలు వచ్చి పానాన నిలిసింది
దానినేమనకుంటినే - పిల్లా లో
కానికే మనకుంటినే.
మరదల్ని జూడంగ మనసు నీరయ్యెనా
మన బాస లేమాయెరా - అయ్య మరి
మన లగ్గమేమయ్యెరా.
అన్న వదినా వచ్చి నన్ను బతిమాలిరీ
కన్నోళ్ళకన్న మిన్నే - వాళ్ళు న
న్నెన్నడే మడుగలేదే.
పాడు రాతన బుట్టి పైకెగురగోరితే
మేడలెక్కడ దొరకురా - ఓరయ్య
ఆడ పుటుకే పాడురా !

## 13

(నీలమ్మ వితంతువు, యువతి, ఒకనాడు
ఆమెను గాజులమ్మే వ్యక్తి వెంబడించి-)

నీమీనా మనసైతందే బుల్ బుల్ పిట్టా !
నువ్వు కాదంటే బతుకాలేనే బుల్‌బుల్ పిట్టా॥
మెడకు నెక్లెస్ చేయిస్తా
జడకు కుప్పెల్ చేయిస్తా
చెవులకు లోలాకుల్దెస్తా
చేతులకు గాజుల్ యిస్తా
అవునంటే జిందా వుంటా బుల్‌బుల్ పిట్టా!
నువు కాదంటే ముర్దా అయితా బుల్‌బుల్ పిట్టా॥
అసల్ సిల్కు చీరల్ దెస్త
అవల్‌దర్జ సొమ్ముల్ దెస్త
బురఖగప్పి తీస్కపోతా
తురకా దొరసాన్నీ చేస్త-
హాఁ అంటే జన్నత్ చూస్త బుల్‌బుల్ పిట్టా!
నువు నహిఁ యంటే నరకం పోతా బుల్‌బుల్ పిట్టా ॥

## 14

(నీలమ్మ అతన్ని నిందిస్తుంది)

| | |
|---|---|
| నీ గాజుల్ నాకద్దు | గాజులోడో గాజులోడా |
| నీ చీరల్ నాకద్దు | గాజులోడా |
| నీ బురఖా నాకద్దు | " " |
| నీ తురకా కులమద్దు | " |
| నా అయ్య నినుజాత్తె | " " |
| నిన్ను నరికి పోగేత్తడుర | " |
| నీ బీబీ నినుజాత్తె | " " |
| నిన్ను చీపిర్తొ కొడ్తదిర | " |
| నీ చెల్లె ననుకోర | " " |
| నన్ను పోనియ్యర | " |





## 15

(దౌర్జన్యానికి పూనుకున్న గాజులవాన్ని రమణమ్మ అన్న రంగన్న తన్నుతడు.
కృతజ్ఞతతో సిగ్గుపడుతూ నిలిచిన నీలమ్మతో రంగన్న)

నల్లదానినైన నువ్వు నమిలి కండ్ల చీరగట్టి
నన్ను చూసి నవ్వుకుంట నాజూగ్గ నిలబడితే
అమ్మతోడు పానమంత యెట్లనో అయితంది
గుమ్మమంట రిమ్మజేరి తాగినట్టుగుంటంది
నిమ్మచెట్ల నీడల్ల నీవు నిలిసి వత్తివా - దా
నిమ్మచెట్ల నీడల్ల నీవు నడిసి వత్తివా-? ॥ అమ్మతోడు ॥
బంతిపువులు దెత్తునా - చా
మంతిపూలు దెత్తునా?
రేణువండ్ల నిత్తునా - నే
రేడుపండ్ల నిత్తునా! - ॥ అమ్మతోడు ॥

## 16

(నీలమ్మ ఒంటరిగా రంగన్న ధ్యాసలో)

మరుగు మందే పెడితివో మంత్రమేదన్నేత్తివో
మాయమాటల్తొ నా మనసునేంజేత్తివో
నినుజూడకుండ నేనుండా
నినుజూత్తె ద్యాసతోనుండా-
కనుమరుగు నువ్వైన కనుమూసుటేడిది?
కనుముందు నువ్వున్న కనుమూసుటేడిది?
నీవున్న లేకున్న నా నిదుర సున్న
నిద్రలేకుంటె మరి బతుకుటెట్లన్న !



## 17

(రంగన్న, నీలమ్మల పెండ్లి అయింది. రంగన్న నీలమ్మతో)



ముద్దబంతీ పువ్వ! ముద్దుగా నువు నవ్వ
పిచ్చిగా మనసైతదే - నీతోనె సచ్చిపోవుద్దయితదే ॥
నువు నవ్వితే మనసు జావుజావ్వ మంటది
నువ్వుంటివా ఉడుకు బువ్వతిన్నట్టైద్ది -
తిట్టినా యేదో తినబెట్టినట్టుంటదే
కొట్టినా పెయికి జోకొట్టినట్టుంటదే -

## 18

(అన్నా వదినల అనురాగం చూసి రమణమ్మ
కృష్ణయ్యను తలచి తనలో ఇట్లా బాధపడుతుంది)

మన ఆట మన పాట - మన ముచ్చటాలెల్ల
మరచీపోతివ నువ్వు - మరచీపోనుర నేను. ॥
తెల్లా జామా పండ్లు - తెచ్చీ నాకందిచ్చి
ఒత్తలేదే అవ్వే - మెత్తబడె నంటివి- మరచి....
చెక్కరి చిల్కాకొని చెరిసగమని పలికి
తలనీకు కాల్నాకని పలికీనవ్ గద నువ్వు - మరచీ....
ఓనగాయను కొరికి ఓముక్క నాకిచ్చి
అల్లనని నేనంటే ఆకూపోకాలంటివి - మరచీ....
కోనేట్ల తానాలు నేను చేత్తుండంగ
ఓ రమణీ నిను జూత్తె ఓర్వయి నయినాలంటివి- మరచీ....
కోడికూర బువ్వ కోరీ నాకందిచ్చి
పచ్చకూరా రొట్టె బాగుందని తింటీవి- మరచీ....





## 19

(కృష్ణయ్య పెరటిలో మర్రిచెట్టు క్రింద కూర్చుని ఇట్లనుకుంటడు)

నసుమోసి కన్నమ్మ నన్నిడిసిపోయె
మాయమ్మ సనిపోతె మావదినె సాదె-
మలిచూలు కొడుకాని మా నాన్న మురిసె
మా అయ్య సనిపోతె మా యన్నె సాదె-
కన్నోళ్ళె దేవుళ్లు అన్నాదీ లోకం
అన్నా వదినె నాకు అసలు దేవుళ్ళు-
పల్లెత్తి మాటేది పలికిందిలేదు
కంటికి రెప్పోలె కాపాడినారు-
కన్నా కొడుకుతీరు నన్నూ పెంచి(ను
తినక దాచి నాకే తినిపించినారు-
ఏతీరుగా వాళ్ళ నెదిరించుతాను?
ఏడిపించక నేనె యేడుస్తుంటాను!

## 20

(రంగన్న తన చెల్లె బాధను గూర్చి క్రిష్ణయ్యతో)

ఏమి చెప్పుమంటవ్ బావా?
ఎట్లైందో మా రమణవ్వ!

బువ్వలేదు బుగ్గిలేదు, ఎవ్వరితో మాటలేదు,
ఎడ్డిదానివోలే సూత్తది, ఎప్పుడూ యేడుత్తనె వుంటది ॥ ఏమి ॥
నిప్పసోంటి మనిసెట్లనొ మరి, నిన్ను జూసి నీరయ్యింది
నీ మనాదితోనే యిప్పుడు ఏముందీ సగమయ్యింది ॥ ఏమి ॥
నువ్వు రాకపోతె రమణి అవ్వతోడు సత్తది సూడు !
మల్ల నీకో పెండ్లం వత్తది, చెల్లె నాకెట్లా దొరుకుతది? ॥ ఏమి ॥

## 21

( రంగన్నతో పాటు తనను చూచుటానికి వచ్చిన క్రిష్ణయ్యతో రమణమ్మ)

మనసైనా సిన్నదాన్ని - యేమన మనసూ లేనిదాన్ని
బావా ! నీ లగ్గమాళ్ళ చూడాలె పిల్వబంపు ॥ బావా ॥

ఈనాడు నువ్వేమన్న యేనాడొ నేన్నీదాన్ని
యెన్నెన్ని మాటలనుకున్నం యెన్నెన్నితీర్ల కలిసున్నం ॥ బావా ॥

కోరేదేముంది నాకు, మీరు సకంగుంటె చాలు
మీ యిద్దరిని కండ్లజూసి- ఆ మీదోనికి శరణంట ॥ బావా ॥

## 22

(క్రిష్ణయ్య, రమణమ్మ నోదార్చుతడు)

ఏడువకే నువ్వు, చూడలేనే నేను
ఏడ్సియేడ్సి నువ్వు - యేమికానున్నవో
ఎండిపోయిన దొండ - పండుతీరైనవు ॥

ఏడ్వ సత్తువలేక - ఎగదట్టుతున్నవు
యేడ్సియేడ్సి కండ్లు - యెఱ్రవడ్డయి సూడు ॥

ఎనక ముందైతె నువు - ఏమికాదే అంటి
ఎనక ముందెరుగక - ఏకమే మనమంటి ॥

మన బతుకు లొకటంటి - మన పెండ్లి నిజమంటి
మనసు కల్సినదాన్ని - మరియాదే కాదనుడు ॥

నిన్నిడిసి నేనెట్ల - నన్న నిలిసేనేమొ
నన్నిడిసి బతుకవు - నిన్నిడిసిపోనే ॥







## 23

(సీతమ్మ బాధ)

కన్నకొడు కనుకొని కన్నుల్లబెట్టి సాత్తె
మన్ను నోట గొట్టిపాయెనా - నా మరది
మాటకూడ మానేసెనా-
లాలబోసి జోలపాడి పాలు బువ్వ పెట్టి సాత్తె
మమ్ముల నే యిడ్సిపోయెనా - నా మరది
మా బమలే మర్సిపోయెనా-
యెందరొన్ని తీర్లన్నా యినక మాకు దీమనుకొని
నమ్మి పెంచి పెద్దజేత్తెనూ - నా మరది
నట్టేట ముంచిపోయెనూ-

## 24

(సీతమ్మను భర్త ఓదార్చుచతడు)

ఎవలకెవ్వలె పిచ్చిదానా! ఎందుకే రంది నీలోనా!
రాంగ యెవ్వలురారు - పోంగ యెవ్వలు పోరు
నడిమి సుట్టరికాలు - నడుమనే పోతయే- ॥ ఎవల ॥
అక్కరున్నప్పుడే అందరూ చుట్టాలు
ఆయెనక కనరారు అంతే లోకంతీరు- ॥ ఎవలు ॥
పంతాలకు పోతె బాదలా దప్పవు
కాళ్ళు రెక్కలత్తె కన్నోల్లె యినరైరి- ॥ ఎవలు ॥
పాలివానికంటె పగవాడు మేలంట
పాలివాడన్నంక పంపాటకమె కాదె- ॥ ఎవలు ॥



## 25

(క్రిష్ణయ్య)



యెన్నీల పిండార బోసినట్టుందీ
కన్నెపిల్లా జోడిగా పక్కనుందీ
ఇంకేమి నాకు కావాలె?
రంబ వచ్చినా కాల దన్నాలె!
మారమణి మారాణి మంచి కుంకుమ బరణీ
ఎంత చక్కని రూపు ఎంత చెక్కరి చూపు,
ఎన్ని జనుమల పున్నె మేకమై చేరిందొ?
రామచిలుకా పలుకు, రామసక్కటి గుణము!
ఇంకేమి నాకు కావాలె
రంబ వచ్చినా కాల దన్నాలె॥

## 26

(ఒక పేద రైతు భార్య మల్లమ్మ వెత)

ఏమి రాతను రాత్తివిరా – అయ్యయ్యో నా
దేమి బతుకును జేత్తివిరా–
ఉప్పుతో తొమ్మిదికి యెప్పుడు తిప్పలె
కల్లంల గింజలు యిల్లూ జేరవాయె–
చెమటడిపి పనిజేసి చేన్లన్ని పండిత్తె
నాగులకు కొలువంగ నాల్నాల్లు రావయ్యో–
తినబోతె పదిమంది, తినుటానికేముంది?
పొయిమీద పొయికింద చేపొయిల బతుకైంది–
రేగడి న్యాలాయె లాగోడి లేదాయె
దున్నే యెడ్లేవుంటె మన్నే బంగారము–
కడుపుల పేగులు నోట్లెకెక్కిరాంగ
కడుపులెండిపోంగ కట్టపడుతుంటిమి–
గుడిసైనా ఉందంటే కూలిపోతున్నది.
కంకెడన్నం లేక కడుపు మాడుతుంది–
చూరు నీడ దిగి బారెడు నడిసింది
కండ్లకు చీకటి కమ్ముకత్తున్నది– ॥ ఏమి ॥





## 27

(భర్త కొడితే యేడుస్తున్న మల్లమ్మను నీలమ్మ ఓదార్చుతుంది)

ఏమిటే మల్లమ్మ ఏడుత్త కూసున్నవ్ !
ఎందుకే తిడ్తున్నవ్ ఏమి బాముక తింటవ్ ?
తిడితేనే నీకట్టం తీరిపోతాదె
యేడిత్తె నీగోస యేడికి పోదె ॥
ఆడపుటుకా పుడితే అన్నిటా లొొతుకేనే
వంక తొవ్వలు మొగవాళ్ళకే చెల్లేనె ॥
ఎరుకలేని మనిసా, ఎందుకే రేశము?
మల్లా వాడేవత్తె మద్దెల వాయించు ॥
బొంకు నేర్పినంకె రంకుజేత్తరు వాళ్ళు
కరువ నేర్పినంకె మొరిగెటోళ్ళె వాళ్ళు ॥
యింటిదాన్ని యిడ్సి యెన్నొ దిరిగొత్తరు
పిల్ల జెల్ల నిడ్సి కల్లుదాగత్తరు ॥
పొలగండ్లు తల్లినే పోరు పెడుతుంటరు
ఆల్లకేమి రంది యాల్లకే వత్తరు ॥
అప్పుసప్పులోల్లు ఆలినే తిడుతరు
అన్ని ఊడ్సుకపోతె అది కర్మమంటరు ॥
బార్యె బిడ్డల్నొదిలి బైరాగులౌతరు
సార గంజయిదాగి సాదులమంటరు
ఊపిరి నెట్లనో ఉగ్గబట్టూకొని
జరుపుకపోవల్నె జలుమమెత్తినంక.



## 28

(వానల్లేక కరువు వచ్చింది. జనం బాధపడుతున్నరు)



కొత్తకొండీరన్నా కోరమీసం కొనిపెడితీ
కొండగట్టంజన్నా కొబ్బరికాయె కొనికొడితీ
వాననేం జేత్తిర్రో, పానాలెందుకు దీత్తర్రో-
ఏడు కొండల యెంకన్నా యెములాడా రాజన్నా
యాలారా కొమిరెల్లీ ఐలేని మల్లన్నా
ఏం తక్కువ జేత్తిమిరో, ఏందు కిట్ల జేత్తిర్రో-
నల్లగొండ నర్సిమ్మా నల్లగొర్రెను కోత్తిమా
ఇల్లంతకుంటా రామన్నా యేటా నీగుడి కత్తిమా
వాననేం జేత్తిర్రో, పానాలెందుకు తీత్తర్రో-
ఎల్లమ్మా పోశమ్మా కల్లూ ముంతలు తెత్తిమా
సమ్మక్కా సరక్కా సారా బెల్లం యిత్తిమా
ఏం తక్కువ జేత్తిమే, ఎందు కిట్ల జేత్తిరే-
చేన్లెండె చెర్లెండె చేదాబాయిలెండె
కొర్రాయోలె ఎండచ్చె గొడ్డుగోదా జచ్చె
ఏం పాపం జేత్తిమిరో, ఎందుకిట్ల జేత్తర్రో-

## 29

(క్రిష్టయ్య రమణమ్మతో)

పల్లెలో యిక బతుకలేమే – నేను
పట్నానికీ పోయి పనిజూసి వత్తు॥
పల్లె తలకిందులయ్యింది – ఇది
మల్లెవడ్డ మక్క పెరడోలె వుంది,
పట్నాన పనిజెయ్యబోతా– మన
పల్లెన కైకిలికి మనసొప్పుకోదే. ॥పల్లెలో॥





## 30

(రమణమ్మ భర్తతో వెల్తనంటుంది)

ఎన్ని చెప్పినగాని యిననూ
నిన్నిడిసి నేనేండలేనూ-
అన్న వున్నరు నన్ను కన్నోల్ల జూడంగ
నన్ను కాదని యేరే నిన్నెవలు జూసేరు ॥
పులివోలె రూపున్న పిల్లి కూనవు నువ్వు
పులుకు పులుకున జూస్త పులుకపు పలుకవూ ॥
పనికి పొయ్యేముందు వంటజేసీ పెడుత
పనికీ నువ్వు పోంగ నీయెంట నేనొత్త- ॥ఎన్ని॥

## 31

(క్రిష్ణయ్య భార్యను తనతో రావద్దంటరు)

ఉల్లీ పొట్టసొంటి సన్నని వొల్లెను తెస్తనే రమణమ్మా
మల్లెపువ్వుల వాయిల్ రైక నల్లది దెస్తనె రమణమ్మా॥
కోకగట్టి కొప్పుపెట్టి
కొప్పుమీద కొంగుగప్పి
సింగారంగా నువ్వు నడిస్తే చిత్తైపోతనే రమణమ్మా
సిత్తగించవే రమణమ్మా వత్తననబోకె రమణమ్మా॥
తళతళ మెరిసే అద్దందెస్త
మిలమిల మెరిసే దువ్వెనదెస్త
తిలకం సీసా కాటుక డబ్బా
తిరుపతి సవరం పొడరు డబ్బా
తీసుకవస్తే యేసెమేసి
సీన్మబొమ్మొలె నువ్వు నడిస్తే
చిత్తైపోతనె ఓరమణీ
సిత్తగించవే నా రమణీ॥



## 32

(రమణమ్మ)

నగలు నాకేమొద్దు
నన్నిడిసి పోవద్దు
    ఉబ్బిత్తె నేనుబ్బిపోనూ - ఆ
    డబ్బు నిను మించుననుకోనూ-
కలినొ గంజినొ తాగి
కష్ట సుకముల కల్సి
    ఉన్నూరులోనె ఉందాము - మనకు
    ఉన్నంతలోనె తిందాము-

## 33

(రమణమ్మ)

ఏడున్నవు? ఎట్ల మరిశున్నవు?
నన్నె యిడిశున్నవూ నువ్వేడున్నవు-
బుదురగించి నన్ను బుట్లేసుకుంటివి
బుద్ధి మాటలు చెప్తె వద్దు పొమ్మంటివి-
పనికెల్లి పగటాల్ల మునిమాపు నేనత్తె
కడప దాటకముందె కన్నుగిలిపే సామి-
కాళ్లు సేతులనైన కడుగుకోనియకుండ
ఆవురావురుమంట అడ్డమచ్చే సామి-
పల్లెటూరిన బతుక వల్లకాదంటివా
పట్నాన పనిజూసి వత్తనని పోతివా-
ఏమిటో నీసేత ఏమన్న రోత
యెవలనేమందు యిది నా నొసటి రాత-







## 34



(రమణమ్మ)

    బావా బంగారుకొండా!
    బతుకర నిను చూడకుండా- ॥బావా॥
కైలిగిత్తవోలె నువ్వు కట్టమీద పోతుంటె
కట్టపొన్న వచ్చెటోళ్ళ కండ్లన్నీ నీమీన్నె ॥బావా॥
పెద్దాపటేలు కొడుకు పెరటిపక్క నన్నుజూసి
పెదవులిరుసుకుంట నవ్వి పిచ్చిమాట లంటండు- ॥బావా॥
చిన్నా పటేలు మొన్న చీకటి చింతలకాడ
చెట్టుసాటుకు నిల్సి సిటికేసి పిలిసిండు- ॥బావా॥
ఒంటిగున్నదంటె పుట్టినింట వున్న ఆడికంటె
ఊరి గుంటనక్కలన్ని ఊళలేత్త యివ్వతోడు- ॥బావా॥

## 35

(రమణమ్మ)

బండోడ రాందాసూ పట్నం బోతున్నావా?
ఓ బండి రాందాసూ పనివుంది జరసైసు;
ఓ బండి రాందాసూ ఒకమాట యినుతమ్మి!
పనికెళ్ళి మా ఆయినె పట్నంల్నే ఉంటండు
పట్నంల మన దొరా వాడల్నే ఉంటండట
ఒక్కమాట జెప్తివా మొక్కుత దేవునివని
అక్క కల్విందను అంత మంచే అను-
కాముక రమ్మనూ కనబడి పొమ్మనూ
కండ్లల్ల ఉన్నడను కలువరిత్తున్నదను
కలువరిత్తున్నదను కలలవత్తున్నడను-
సెనిగెలేంచిన యున్నయ్ సిరిసెనిగె కాయుంది
బట్టపేగుల కడుత బావ కిచ్చిరార-
మామిడికాయ తొక్కు మద్దవానుల పెడుత
కంకెడంతే తమ్మి, కస్టమేమి కాదు-

## 36

(క్రిష్ణయ్య పట్నం నుంచి వచ్చి భార్యతో)

ఎన్నో చిత్రాలున్నయే పట్నాన, దేన్ని చెప్పుమంటవే ॥
ఆస్పిటల్ నర్సమ్మ అట్లిట్లనో చేత్తె
ఆగు- మా రమణమ్మ నడిగి వస్తానంటి-
మేనేజర్ పెండ్లాము మింగినటు నను జూస్తె
వాడు నౌకరి పీకి వారి పొమ్మన్నడూ-
నేనున్న గుడిసెల్నె నీవోల్నె ఒకతుంది
దాని వగలకు తండ్రి దాన్నిస్తనని వచ్చె- ॥ఎన్నో॥

## 37

(రమణమ్మ)

మాయ మాటలు చాలురా - నీ
తీయ తీయమాటలు సాలురా-
మాముందరోమాట మాచాటుకోమాట
మనమా యిజ్జతా మగపుటుక పుట్టితే,
ఇంట బయటా నాకు జంటగా వుంటనని
మాట యిచ్చి మరిసి యేటకెళ్ళత్తివా?
యెడ్డి పిలగానివలె యెంబడి బడితివి
యెన్నొ బాసలుజేసి నన్నిడువనంటివి
కైతికాలు జేసి కార్యెమెల్లదీసి
వుంటినా యిడువవు లేకుంటె తలువవు.







## 38

(క్రిష్ణయ్య)



అలుగకే నా రామచిలుకా ! నువ్వు
అలిగితే కన్నీళ్ళు అలుగులై ఉరుకు,
అలుగకే నా రామచిలుకా-
అలుకగే - అటుదిక్కు మలుగకే
అలుసుగా గులుగకే అందాల చిలుకా !
అలుగకే నా రామచిలుకా-
పలుకవే రతనాల మొలకా, నీ
పలుకులో సరికొత్త రతనాలు తొలుకా
పలుకవే రతనాల మొలుకా-
పలుకవే బంగారు గిలకవే
పన్నీరు చిలుకవే మరుమల్లె మొలకా !
పలుకవే నా రామచిలుకా-

## 39

(రమణమ్మ)

బుద్ధి మాటలు జెప్తె వద్దువద్దని పొయ్యి
ఇన్ని నెళ్లైనంక ఇప్పుడా నీరాక ?
ఇన్నట్టె యింటివి ఉన్నట్టె వుంటివి
ఇడిసిపెట్టి పోయి ఇగరావు అగరావు,
కడపలోపలె ఉన్న ఆడివోల్నె నాకుంది
ఒంటి పాడు బతుకు కంట కునుకు రాదు,
పండుగని పబ్బమని పదిమంది సంబ్రపడ
నాకేమొ నువు లేక నరకమోల్నె వుంది-

## 40
(క్రిష్ణయ్య)

కోడిపుంజుతీరును సూత్తె కోరికేదో పుట్టుతున్నదీ
దానివంటి బతుకే అయితే దర్జగా ఉండనిపిస్తున్నది.
పెండ్లంతో పేచీలేదు- పిల్లల పెంచాలని లేదు
సంసారం రందీ లేదు సరసాలు తక్కువ కాదు
మెడనెత్తి చూస్తవుంటే మడమెత్తి నడుస్తువుంటే
రాజువంటి దాని తీవి రాదే నాకనిపిస్తున్నది-

## 41
(రమణమ్మ)

కోడి బతుకు బాగుందంటే కోపం నాకొత్తుందయ్యా
కోడికంటే నీయీ పుటుక కోటంతలు మేలుగదయ్యా-
మనుసులకూ పసి పచ్చులకూ మానం మరియాదే తేడా
మనం కూడా పసులమె అయితే మనుసులనే మాటింకేడ?
కత్తిబట్టి కోడి మెడను కరకమని కోత్తర్రయ్యో
ఉప్పు కారమేసి దాన్ని ఉడికించుకు తింటర్రయ్యో-
లోకంల యీ నరజన్మ రాక రాక వచ్చేదంటరు
అందుల మరి మీ మగజన్మ అదురుట్టం వుంటే నంటరు-







## 42
(క్రిష్ణయ్య-రమణమ్మ)

వన్నె చిన్నెలదానా - సన్నటి నడుముదానా
నీ వన్నెల చిన్నెలు జూసి - నీ కన్నుల వన్నెలు జూసీ
నా మనసంతా మైకంతోని
రివరివ రివరివ రివరివ రివరివ మంటందీ
యెవరికి యెవరం యివరం దెల్పుమంటందీ
షోకూ టీకూలవాడా- బాకూ బల్లేమువాడా
నీ బడాయి మాటలు వింటే - నీ లడాయి చేస్టలుకంటే
నామనసంతా కోపంతోటీ
కువకువ కువకువ కువకువ కువకువ మంటందీ
నువునేనెవరం యెవరికి యెవరం
యెవరికివారే యమునాతీరే అంటుందీ-

## 43
(సీతమ్మ మగనితో)

యేమయ్యా విను ఒక్క మాటా - నువ్వు
యినకుంటె నే పచ్చి నీళ్ళైన ముట్టా -
పిల్లాజెల్లాలేని యిల్లూ యిల్లేకాదు
పిల్లా పాపలులేక తల్లాడిల్లూ మనసు॥
కుడిదీల యెలుకోలె కుందాపనము నాకు
కుమ్ముల కందోలె కుములుతున్నది నువ్వు॥
నమ్మి పెంచిన మరది నట్టేట యిడిసెను
ఎట్ట గడుసునో ముందు పుట్టి మునుగునో యేమొ॥
మాచెల్లె మరుమల్లె మల్లా పెండ్లాడు
మనకు పిల్లలైతే మనకు చేదోడు॥

## 44

(రామయ్య సీతమ్మతో)

ఈడు గడిచినంక ఎందుకే పెండ్లి
ఇద్దరు పెండ్లాలు ఎందుకే నాకు ?
ఇద్దరట విష్ణుకూ ఇద్దరట శివునికీ
వాళ్ల గోసలు నాకు వద్దు నువ్వేచాలు ॥ఈడు॥
తెల్లెంటికల నొకతి నల్లెంటికల నొకతి
ఊడపీకితె గుండు కోడి గుడ్డయితదీ ॥ఈడు॥
బిడ్డ వయసు దాన్ని పెండ్లమని యెట్లందు
మంది నవ్వుడు పోని మనసు కెట్లుంటదే- ॥ఈడు॥
అమవాస కొన్నాళ్ళు పున్నమి కొన్నాళ్ళు
మన బతుకులకుకూడ మంచి రోజూలుంటయ్- ॥ఈడు॥

## 45

ఎండ లెనుకకు పట్టసాగినై - గంగ మబ్బులు
కుండపోతగ కురువ సాగినై,
చెర్లు కుంటాలన్ని నిండినై - మత్తళ్ళు దుంకి
దొర్లు వాగులు పొర్లి పారినై,
కాపులు నాగళ్లు పట్టిన్రు - విత్తనాల
గంపలేమో నెత్తి కెత్తింర్రు,
చేను చెల్కా పచ్చపడ్డాది - సొమ్మసిల్లిన
పానాలకు ఊపిరచ్చింది,
కాలమే దయజూపకపోతే - యింతకాలం
నేలపై జనముండగల్గేరా.







## 46

(క్రిష్ణయ్య)

సూడ బుద్దయితున్నదే - ఒకసారి సూడబుద్దయితున్నదే
చుక్కసొంటి కొడుకు పక్కలా పడుకొని
నీకంటె ముద్దుగా నాకు కనిపిస్తుంటె- ॥సూడ॥
పాలకని సిన్నోడు గోలపెడుతుంటేను
పనినిడిసి నువ్వేమొ పరుగెత్తుకొని రాంగ ॥సూడ॥
పట్నాన బొగెయాం పక్కనా నిలబడి
పొయ్యే జంటలజూసి పోజెట్ల పెడుతవో- ॥సూడ॥
పదిమంది తల్లివై పని తెములకా నువ్వు
పుల్లెందుల పడగ పిల్లా నిన్నొకమలుక- ॥సూడ॥



## 47

(రమణమ్మ)

ఇద్దరైతే ముద్దు ముగ్గురే నాకద్దు !
పదిమంది పిల్లలెందులకూ ?
పాత కాలము కాదు రందులకూ !!
యెడపిల్ల నీయెంట కడపిల్ల నాయెంట
మనయిద్దరిది జంట మరువరానిదెయంట!
కనుటకేమిటి పనులు కనుటలేవటనా!
కన్నవాళ్ళను చక్కగను పెంచవలెరా!



# 48

( క్రిష్ణయ్య - రమణమ్మ )

తొలిచూలు కొడుకైతడే మలిచూలు బిడ్డయితదీ
తొల్సూరు బిడ్డయితదీ మల్సూరు కొడుకౌతడూ-

కొడుకైన బిడ్డయిన నాకొక్కటే
కొడుకైతె నాకెంతొ బలముంటదే -

బిడ్డయిన కొడుకయిన నాకొక్కటే
బిడ్డయితె పనికాసరగ వుంటదీ -

ఇద్దరు కొడుకలైతె యింకెట్ల చెప్పు?
ఇల్లు బంగారమైద్ది ఇంకేమి సిక్కు!

ఇద్దరు బిడ్డలైతె ఇంకెట్ల చెప్పు?
ఇల్లు పూదోటైద్ది యింకేటి సిక్కు!
కొడుకైతె నాకెంతొ బలముంటదే!
బిడ్డయితె పనికాసరగ వుంటదీ!





# 49

(క్రిష్ణయ్యతో అన్న)

బతుకంటె కతకాదురా - తమ్ముడా
బతుకు యెతలకె కాదురా-

బతుకంటె నడివాగు పడవేనురా
ఏగాలి కెటు వాటొ యెరుగాలిరా

నాల్నాళ్ల దిది మాయ నాటకంరా
నాకోసమే అనక నడువాలిరా-

మనకోసమే మనం అనవద్దురా
మనవాళ్ళ మనసుల కనముద్దురా-

కడుపు పేగులె జారి కాళ్ళపై బడ్డట్టు
కాళ్ళపైబడి నువ్వు కదలవేమిర తమ్మి?

ఎంత బాగున్నోని వెట్ల పెయి దీసిండి
చింతతో మీ వదినె చిక్కి సగమయ్యింది

ఏమమ్మ మరదలా ! యేరు సంసారమా?
ఎన్నాళ్ళు పంతాలు మీ యింటికే రాక-

## 50

అన్న తమ్ముని కౌగిలించే - తమ్ము
డన్న కాళ్ళను మ్రొక్కి నిలిచే -

కన్నీరు జలజలా కారె నిద్దరి కళ్ళ
రార క్రిష్ణా! యంట పిలిచే - అన్న
రార తమ్ముడ! యంట పిలిచే -

వాళ్ళిద్దరిని జూసి "వారెవా" యనుకొని
వంటైంది తినిపోదమందీ - రమణమ్మ
గంటలో వండి పెట్టింది -

వాకిట్ల నిలబడి వాళ్ళు ముగ్గురు రాంగ
సీతమ్మ సంబ్రపడ్డాదీ - రామ
సిలుకోలె నవ్వుతున్నాదీ!

